# పరీక్షణము

*

శ్రీ సదాశివ

నందన ఉగాది

1952

# తొలిపలుకు

విద్యార్థిగా నున్నప్పటినుండియుఁ గవిత చెప్పవాఁడనే కాని పదిమందిముందఱ నా పద్యముల వినిపించుటకుఁ గాని, చూపుటకుఁ గాని సాహసించువాఁడఁ గాను. ఈ గుణముండుటవలననే కాఁబోలు నే నేకవికినిఁ బరిచితుఁడఁ గాలేకపోయితిని. గతసంవత్సరమునుండి మిత్రుల ప్రోత్సాహమువలన నా కవితను బ్రకటింప సంకల్పించితిని.

తొలుదొల్త శ్రీ సాంబశివ శతకమును ముద్రింపఁ జేయవలెనని నా మాతాపితరుల యుద్దేశము. కేవలము భావములపైననే దృష్టినుంచి కవిత్వ లక్షణోల్లంఘన మొనరించుట నాకెందుకో నచ్చదు. అదియుఁగాక అపూర్వభావ విలసితములగు నింగ్లీషు, ఉర్దూ కావ్యముల నతిశ్రద్ధతోఁ జదివితిని. వానిలోను లక్షణాతిక్రమణ మెందును గానరాదు. కావునఁ దొలుత నా కవితలోని లక్షణలోపములను సాధ్యమైనంతవరకుఁ దొలఁగించుకొనవలయునను తలంపున లక్షణవేత్తలును, నాంధ్రబిల్హణబిరుదాంచితులునగు బ్రహ్మశ్రీ శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారికి నా శతకమును బంపితిని. వారి ముఖపరిచయము గూడ నాకు లేకున్నను వారు నాయందాదరానురాగములనుజూపి నా పుస్తకమును సమగ్రముగాఁ బరిశీలించి పరిశోధించి, సవరించి నేనెఱుఁగని లక్షణసూత్రములనే కాక భావములనుగూడఁ బెక్కింటిని నాకెఱుకపఱచి సాంబశివశతకమును ముద్రింపించిరి.

వారే నా యీ రెండవ పుస్తకమును గూడ నక్లేశమనక సవరించి తమ యమూల్య గ్రంథపరిచయ వాక్యములతో ముద్రింపించినారు. వారికి శిష్యభావముతోఁ గృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

ఈ పుస్తకమునకు వలయు ముద్రణ వ్యయముల భరించి నన్ను ప్రోత్సహించిన శ్రీ కర్నా వెంకటనర్సయ్యగారి విద్యాభిమానము ప్రశంసనీయము. వారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఇట్లు,

గ్రంథకర్త.

# గ్రంథపరిచయము.

శ్రీ సదాశివగారు దాదాపొక సంవత్సరమునుండి నాకు సాహితీ బంధువులు. భగవతి సరస్వతి మా యిరువురకును మైత్రినిఁ గూర్చినది. ఏకలవ్యశిష్యునిఁబోలి వారు నన్ను [illegible] కయుండియే యెంతోకాలము సాహిత్యములోను కవిత్వములోను నా యుపదేశముల నందుచుఁ జక్కని సలక్షణ కవిత నలవఱచుకొని క్రమముగా సుమధురములైన భావములతో, మృదుపదగుంభనముతో, నర్థగాంభీర్యముతో, నుడి వోని శయ్యాసారళ్యముతోను గవితనల్లుటలో గడిదేఱిరి. ఈ కవితాఖండములలోని ప్రతిపద్యమున్ను ప్రతిపదరసస్యంది గానున్నది. ఈ కావ్యఖండము తెలుఁగుతల్లి కమూల్యహారమై యీ కవికుమారుడు తెలంగాణా కవులలోఁ దలమానికమై వెలయుదురుగాక.

హైదరాబాదు.
౨౮-౨-౧౯౫౨

ఆంధ్ర విజ్ఞాన, శిరోమణి,
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

# అంకితము



నాంకీడిపుర వాస్తవ్యులును, పండిత ప్రియులు నగు శ్రీ గాదె- సాంబయ్య శావుకారుగారి వద్దల మునీముగాఁ బనిచేయుచున్న శ్రీ కర్ర వేంకటనరసయ్య గారికి.

సదాశివ

# శుభాకాంక్ష



క॥ శ్రీ వల్లభపద భక్తుఁడు
శ్రీ వేంకటసర్మనాఁ బ్రసిద్ధుండెలమిన్
శ్రీ వెలయఁగ నివసించును
శ్రీ వాఁకిడి పురమునందు స్థిరవిభవుండై-

క॥ సతిపుల్లమ్మయుఁ దానీ
కృతి భూషంగొనిరి మిగులఁ బ్రీతిదలిర్పన్
తతగుణ ధనులగు నీదం
పతులకు శ్రీ శుండు సకల భాగ్యమొసఁగు

# ప్రార్థనము



సీ॥ ద్వాపరంబున భగవత్ప్రకృతిప్రేమ
మఖిలగోపజనంబు నరయఁజేసి,
తన్మయులగుచు మోదంబునవినెడు ప్రేం
తలకును వేణునాదంబువినిచి,
ప్రకృతి విరాగానురాగ తత్త్వంబుల
నిల మనుజాళికి నెఱుఁగఁ జేసి,
ఆహవంబున నిరుత్సాహియైన కిరీటి
కమలగీతోపదేశము నొసఁగి

నట్టి నీదివ్యమూర్తి నహర్నిశంబు
హృదయమున నిల్పి స్మరియింతు మాదమలోన
నీకృపాదృష్టి నాపయినిల్పి, సత్ప
థంబుజూపి ప్రోవుము నిరంతరముఁగృష్ణ!

శ్రీ

# నిరీక్షణము

## 1

చ॥ కలఁదొక యేఱియొడ్డున నొకానొకపల్లియ, దానిదాపున
న్గలదుకుటీరమొం డచటఁ గాపురముండును వృద్ధుఁడొక్కఁ డీ
మ్ములఁదనకూతుతోడ సతముం దన దేశమునన్ వసించు వా
రలతని సుస్వభావము గరంబు నుతించుచు గౌరవించఁగన్.

క॥ ఆతని యేకైక సుతయు
గీతయనెడు నాఖ్యఁబరఁగి, కీర్తి వడసి, యా
న్యాతీతం బనఁదగు సుగు
ణాతిశయంబొప్ప, సుందరాకృతిఁదనరున్.

క॥ పల్లియలోఁ బుట్టి, పెరిగి,
పల్లెబ్రతుకు పసనెఱింగి, బాల్యంబుననే
తల్లినిఁబాసిన యనుఁగుం
బిల్లనతిప్రేమఁ బెనుచు వృద్ధుండెపుడున్.

తే॥ గీ॥ పట్టణంబులఁ గలభోగ భాగ్యతతుల
ననుభవించి యెఱుంగని యాలతాంగి
తోడులేకయే విహరించుఁ దోఁటలోని
తరులతాదులే తోడయి తనను గొలువ-

ఉ॥ ఒకచోటఁ దండ్రిసేవనము నోరిమిమైనొనరించు; నొకచోట
న్మక్కువతో వనంబున సుమంబులఁగోయునుదండ్రిపూజకై
యొకచోటఁ గీరశారికల-నొయ్యనడాయుచుఁబల్కరించు; వే
ఱొకచోట నేటిలోఁదిరుగు-నొంటిగనావపయిన్ముదంబుగన్.

తే॥ గీ॥ తేపు మాపులఁ బడవపైఁ బ్రీతిమెఱయ
నేరు దాఁటుచు నాతలి తీరమందు
నున్న లేమావిక్రిందఁ గూర్చుండి కొంత
సేపెవరికోసమో నిరీక్షించు చుండు.

తే॥ గీ॥ ఈ విశాలప్రపంచ మందెంచి చూడ
వృద్ధపిత యొక్కరుఁడు దప్ప నితరులెవరు
లేరు తనవారనందగు వారలనుచు
నెఱిఁగియును నానిరీక్షణ మెవరికొఱకొ!

మ॥ ఒకవర్షర్తుదినంబునంబరములో-నున్నట్టిసన్మిత్రుచెం
తకునావృద్ధుఁడుపోవఁగాఁదలచి,గీతంబిల్చి "యోయమ్మ! నేఁ
టికినామిత్రునిఁ జూచి, మాపటికిని ట్లేవత్తు నీవంతమ
ట్టుకజాగ్రత్తగనుండు మెవ్వరును తో-డున్ లేరునీకిచ్చటన్,

క॥ అయిన భయమేమి లేదె
ట్లయినన్నేవత్తు రాత్రియగువఱకును, నీ
పయిదృష్టినుంచుటకు ప
ల్లియవారికిఁ జెప్పిపోదు నె" మ్మనియతఁడున్.

తే॥ గీ॥ చెప్పఁదగినవి చెప్పి, నిశ్చింతుఁడగుచు
నరిగెఁబట్టణమునకు; ననంతరమున
గీతయును దైనికంబు లౌకృత్యములను
దొంటిరీతిని నెఱవేర్చి తోఁటకేగె.

సీ॥ అనిలసంచలితంబులగు శిరోజముల నం
చితరీతి కొప్పుగఁ జేర్చిచేర్చి,
అతిసుకుమారంబులగులతాంతంబులఁ
గోమలాంగుళులచేఁ గోసికోసి,
పూరేకులను భ్రమర్ సారెకుఁబెదవుల
వ్రాలెడు తేఁటులఁదోలితోలి,
మృదుపాదములను బురద నేలలఁబ్రియత్న
మునఁ బదిలంబుగా మోపిమోపి,
అలసి కాఁబోలు నా, జవరాలుకొంత
తడవు విశ్రాంతి గొననొక్క తరువుక్రింద
నున్న చట్రాతిపైనఁ గూర్చుండి, ప్రకృతి
శోభఁ బారవశ్యంబునఁ జూచుచుండె.

తే॥ గీ॥ కొంతతడ వట్లయుండి యా కోమలాంగి
యినునిఁగని యేమిదలఁచెనో హృదయమందు
పరుగుపరుగున నదిఁజేరి, పడవవిప్పి,
దానినీటికిఁదిగిచి యాసీనయయ్యె.

క॥ ఆనదితీరము నొరసి భ
యానకముగఁ బారుచున్న నైనఁబడవపై
నా నెలఁతుక నిర్భయముగఁ
దానావలి యొడ్డుసేరె;— తత్సమయమునన్.

సీ॥ పిల్లఁగ్రోవిని స్వకల్పిత రాగతాళాల
వరలు సంగీత మవార్యలీలఁ
బాడుచుఁ బసులకాపరులు పొలమునుండి
యాలఁదోల్కొని పల్లె కరుగుచుండఁ,

గల కలారవములు గడలనించుచుఁ బక్షు
లెఱిఁగొని గూండ్లకు నేగుచుండ
నర్కుండు ముదిమి మైనపరాశఁ దిరుగుచు
విశ్రమస్థానంబు వెదకుచుండ,
నపరగిరి శిఖరంబుల నరుణిమంబు
ప్రబల, వసుమతి కుంకుమరాగశోభ
వరలుచుండఁగ, దొందాల మురిపెమొప్ప
రజని వెనుకముందాడుచు రాఁదొడంగె.

సీ॥ పగలెల్లఁ గురిసి నభంబుపై మేఘము
ల్బలుచనై యెడనెడఁ బొఱుచుండఁ
బలురకంబుల వాసనలఁ జొక్కి గంధవా
హుఁడొయ్యారపున్నడ నొప్పుచుండ,
ననిలుండు తూఁగుటుయ్యాల లూఁపఁగ నేటి
యలలెల్లఁ దాండవం బాడుచుండ,
నలలొనరించు నాట్యము మేలవించి ప
క్షులు మంజుగీతము ల్పలుకుచుండ,
నొంటిగా మావి క్రిందఁ గూర్చుండి ప్రతిది
నంబువలె గీత యుత్క్షిప్త నయనయగుచు
నెవరి యాగమనమునకో యెదిరిచూచు
చుండె; క్షణకాల మారీతినున్న వెనుక,

క॥ నవయౌవనాంగుఁ డగునొక
యువకుఁడు తనదెసకు వచ్చుచుండుటఁ గని యా
యువతి కడుజడిసి యాతని
నవలోకించె నతిభీత హరిణేక్షణయై.

క॥ ఆయువతీమణి సోయగ
మాయువకుని మానసంబు నాకర్షించెన్
వేయేల నతఁడు తనవాఁ
డేయని భావించె గీత హృదయమునందున్.

క॥ తనస్వప్నంబుల లోపల
ననవరతము వచ్చినిదుర హరియించుచుఁ దా
ననిశంబుఁ బ్రతీక్షించినఁ
గనరాని యతండువీఁడె కాయనితలఁచెన్.

క॥ ఇనాళ్ళు నిరర్థకమను
కొన్న తన నిరీక్షణంబు కొనసాగఁ గనేఁ
డన్నియు సార్థములగుటం
గన్నులఁగని గీత హర్షగర్వితయయ్యెన్.

తే॥ గీ॥ ప్రియులనేత్ర ద్వయద్వయి పెరసి కొన్ని
క్షణములవ్యక్తభంగి భాషణమునల్పె;
హృదయముల దడదడలభివృద్ధి నొందెఁ
గాని తనువులుబెదవులు గదలకుండె.

క॥ ఆతని నేత్రాంతర్గత
మై తగు తారుణ్యపూరమద్భుతలీలన్
ద్యోతితమై కాన్పింపఁగ
గీత వివశయగుచుఁ జూచెఁ గ్రీఁగన్నుఁగవన్.

తే॥ గీ॥ అతనికన్నులయందు నున్నట్టి తేజ
మాపెకు నపూర్వమనితోఁచ నప్రయత్న
ముగ, తనదు జీవితంబులో మొదటిసారి
తెప్పలార్చక కొంతకన్నులఁ గప్పుకొనియె.

క॥ ఆ మదిరేక్షణ చూపుల
లో మైమఱపొందియునుఁ బలుకఁ జాలక యే
మే మోతలఁచి, యతఁడుతుద
కేమాడక నీటఁజొచ్చి యీఁదుచు నుండెన్.

తే॥ గీ॥ గీత యాటనిలుపఁబడి యే యాతఁ డీఁగు
తెరువుగను చుండె నాతఁ డదృశ్యుఁ డయ్యె
మధ్యనది ; యంతనామె యేమాత్ర మేని
జాగు లేక పడవఁ గొని జలము జొచ్చె-

తే॥ గీ॥ అతఁడు నీటమునిగి యిటునటు కరములఁ
గొట్టుకొనుచు నుండఁగ నాకోమలాంగి
పటురయంబునఁ జనుదెంచి పడవనుండి
త్రాఁటి నొకదాని విసిరె నూఁతగ జలమున.

క॥ చేతికిఁ దగిలిన రజ్జువు
నాతండూఁతఁ గొనియును బ్రయాసంబున నె
ట్లో తేలి, పడవ నెక్కెను
గీతకరము తనకరమునఁ గీలించి వెసన్.

క॥ ఇరువురు దరి జేరి రతఁడు
పరమానందంబు తోడఁ బరవశుఁడగుచున్
గరమనురక్తిన్ "నీ మే
ల్మఱవ" ననుచు గీతకొనె నమాయకలీలన్.

క॥ "ఏ నాఁడు నదీజలముల
నేనీఁది యెఱుంగ ననిన నీవిది హాస్యం
బౌనని తలంతు వేమో !
మానిని ! నీవలన నేడు మరణముఁ దప్పెన్."

తే॥ గీ॥ అతనిమాటలలోని తీయందనంబుఁ
దనివి తీఱఁగఁ జవిచూచి తలరుఁబోఁడి
సిగ్గునందలవంచెను - చిఱుతనగవు
మోముపై నల్లనల్లన మోసులెత్త.

తే॥ గీ॥ కొంతసేపుమౌనంబుగాఁ గూరుచున్న
పిదప విజయుండు బలుకు నవ్వాలఁదితోడ
"మగువ! యీచెంతనున్న గ్రామంబునందు
నే వసించుచునున్నాఁడ నింతవరకు.

తే॥ గీ॥ ఆచట తలిదండ్రులార్జించి నట్టిమేడ,
భూములుంగొన్నియున్నవి పూవుఁబోఁడి!
తల్లిదండ్రులు పసినాఁడె తరలిపోయి
రాప్తులనఁ దగువారు లేరచటనాకు.

తే॥ గీ॥ ఏవిధంబైన ప్రేమనే నెఱుఁగ నకట,
వసుధయందు నెవ్వరును నావారు లేమి,
బ్రతుకుపై రోసి సైనిక భటుఁడనైతి
నొంటిగా నుంటకంటె నిట్టుత్తమమని.

తే॥ గీ॥ నీదుపరిచయంబు లభింప నేఁడపూర్వ
మైనజీవితాపేక్ష లీయవనిలోని
భోగభాగ్యము లన్నిటిఁ బొందుకాంక్ష
లుప్పతిలుచుండె నామది నిప్పుడిపుడె——"

తే॥ గీ॥ అనుచు, మౌనంబుగాఁ గన్నులశ్రుకణము
లురల, దీనదృక్కులఁ జూచుచున్న గీత
కరములం గేలఁ గీలించి కరుణావెలయ
నామెకురులను దువ్వుచి ట్లనియె నపుడు-

తే॥ గీ॥ "నీదు వృత్తంబు నరయఁగా నే మఱచితి
చెప్పుమం"చుఁ బ్రశ్నింపంగ సేద దేరి
అశ్రుధారలఁ దుడుచుచు ననియె గీత
గళమునాకకొంత సవరించి క్షమముగాను.

తే॥ గీ॥ "వృద్ధపిత దప్పనావార లెవరు లేరు
అతఁడు బాల్యంబు నుండి నన్నధికమైన
ప్రేమతోఁ బెంచుచుండఁగాఁ బెరుగుచుంటి
నింత యేనాడు సంగతియంత", యనఁగ.

సీ॥ అపరసంధ్యారాగ హాసితారుణప్రభా
యుతకరపల్లవం బొక్కసారి,
అమితతేజోర్ధ చంద్రాకృతితోఁ జెలు
వొందు ఫాలతలంబు నొక్కసారి,
కర్ణభూషా ప్రభాకీర్ణాంచిత కపోల
యుగ్మంబు లెలమిమై నొక్కసారి,
రదన పంక్తిద్యుతి ప్రతిబింబిత ప్రకా
శోష్ఠబింబంబుల నొక్కసారి,
విజయుఁ డతిపవిత్ర ప్రేమ వెలయునట్లు
చుంబనంబొనరించె; నయ్యంబుజాక్షి
పరవశత్వమునొంది, తద్బాహులతల
డోలికలఁదేలి యూడెమరాళివోలె.

తే॥ గీ॥ ప్రకృతియంతయు నాయువ ప్రణయలీల
లరసిప్రమదంబు జెందినట్లయ్యెఁదలఁప,
నగుమొగంబుల లేఁదీవెలెగసి, యుప్పొ
డెలమి వంగిజోతలు సమర్పించుచుండె.

ఉ॥ తారకలెల్ల నల్లన సుధాకరు చుట్టొకటొక్కటే బయ
ల్దేరుచు, నూత్నదంపతుల తీరుగనుంగొని, స్నేహభావమే
పార, స్మితాననంబుల నభోంగణవీధుల నిల్చిచూడఁ, బ
ద్మారిసుధాంబు బిందులు బ్రియంబునఁ జల్లుచునుండె
వారిపై

తే॥ గీ॥ చిలిపిచేష్టలఁ దెమ్మెర ల్మలసియపుడు
చెలఁగిసుమనోరజంబు వర్షించుచుండె
తీరములనంటి పారు నదీజలంబు
పొంగిపొరలెను హృదయ ముప్పొంగుకొలఁది.

తే॥ గీ॥ అంతనాతని మిత్రులల్లంత దవ్వు
నుండి, యెలుఁగెత్తి పిలుచుచునుండు టెఱిఁగి
యధికతర నూత్నసంభ్రమా యత్తచిత్తుఁ
డగుచు ననురాగ మొప్ప నిట్లనునతండు

ఉ॥ వనలక్ష్మిసాక్షి,మనమిద్దఱమిచ్చటఁబెండ్లియాడినా
మో వరవర్ణినీ! యిచటనొంటిగ నిన్విడి త్రొంటిరేయినే
పోవుచునుంటి; నన్మఱచిపోవకు; మెన్నఁటికైన వచ్చెదన్
నావిధులంద్యజింపఁదగునా! ననుబంపుముప్రీతితోడుతన్

క॥ అని యోదార్పఁగ, దీనా
ననయయి బాష్పాంబుపూర్ణనయనయగుచున
వ్వనజాయతలోచన యి
ట్లనియె వెలుఁగు రాల్పడంగ సనుఁగుసితోడన్.

తే॥ గీ॥ "ఎట్టియభిలాషలును లేక, యెట్టిలోప
మును నెఱుంగక, యేకష్టములు దెలియక

శాంతిసౌఖ్యాలఁగడచు నాజన్మకింక
విరహవేదన గాఁబోలు విధియొనర్చె.

తే॥ గీ॥ అల్పవాంఛలు గలహృదయమున, నిన్ను
గాంచఁగాఁబలు వాంఛలు గలిగెనాకు—
రిత్తవుచ్చియు నవి యెల్లఁ బ్రీతివీడి
యరుగ నెంతువు నా సౌఖ్యమపహరించి.

తే॥ గీ॥ వలదనం జాలనిన్ను; నీవలనదోష
మేమిలేదు; నీత్రోవ నీ వేగుచుండ
మార్గమధ్యంబునందుఁ గర్మవశరీతి
నిన్నుగలసితి; నెవరినేమున్నదనఁగ !

తే॥ గీ॥ ఎందఱనో చూచితిని నిటులేల నేఁడు
నిన్నుజూడఁగ వివశనై యెన్నఁటికినిఁ
దెగని సంబంధ బంధంబు దెచ్చికొంటి
నిదియె దైవ సంకల్పమా నింతనిజము.

కం॥ నీ దర్శనలాభంబు మ
హా దుఃఖమె కొంతకాలమైన నదియె యా
హ్లాదదమగు నీ యనురా
గాదరముల సంస్మరించు నవసరములలోఁ"

తే॥ గీ॥ ఆబిడ యమాయకత్వంబు నరసి; యామె
హృదయము గ్రహించి, మిగుల సంప్రీతుఁడగుచు,
పూరుషుఁడుగానఁ జిత్తంబు బాదివిపట్టి
తిరిగి యోదార్చె నిటువలె ధీరుఁడగుచు.

శా॥ "అన్యోన్యంబును కొంతకాలమున ననన్యప్రేమమైయుండ నీ
కన్యాయంబుగ నిన్నునన్నున విలంఘ్యంబైన కాలంబు నో
కన్యా! దూరము జేయు నేఁడ, యినదుఃఖం బేల బేలా! సుసా
మాన్యం బీయెడఁ బాటు; ప్రేమకిదె సుమ్మా గీటురాయా
రయన్.

తే॥గీ॥ కామవిరహిత సుప్రేమకలితులగుచు
నన్యలభ్యంబు గాని మహాసుఖంబు
గాంత్రు ప్రియజనుల్ తమ వియోగమునఁగూడ
నతివ! మన వియోగంబు దుఃఖార్హమగునె!

తే॥గీ॥ ఒనరఁ బ్రియజనులెల్ల సంయోగసుఖముఁ
బడయఁజాలరు కాలప్రభావగతిని
ముదిత! కొన్నాళ్ళు మనము సంయోగసుఖముఁ
గాంచలేకున్న మనప్రేమ కొంచెమగునె!

మ॥ అలుకంబూనకు; జన్మజన్మలకు నిన్నర్ధాంగి గాఁబొంద నే
వలతున్మానసపీఠి నిల్పి నినుదివ్యప్రేమ రాజిల్లఁబూ
వులఁబూజింతును నేఁటి యీ ప్రణయ మొప్పున్మనంబందుని
చ్చలు గ్రొత్తై పెనుపొందు నాపయిని విశ్వాసంబు నుంచం
దగున్.

క॥ నీమధురస్మృతిఁ జేయుచు
నేమఱపునఁ గన్నుమూయ మదిరేక్షణ! నీ
ప్రేమయె నా హృత్కమలము
లో మెలఁగుచు, కన్నుదోయిలో నుండవలెన్.

తే॥ గీ॥ రేలనొంటిగ నేనిదురించువేళ
నాదు స్వప్నాల దేవకన్యవలె వచ్చి

నాట్యమాడుచు, నవ్వుచు, నన్నుగూడ
రహిని నవ్వింపు మెపుడు నా ప్రణయదేవి!

క॥ సారంబు లేమి గదు వే
సారితి జీవితములోనఁ జంద్రానన! నీ
హారామృత ధారలమన
సారగురియు శుష్కమానసాంగణ మందున్.

క॥ వారము దినములలోనిను
జేరఁగఁజనుదెంతు; నేను జేసిన బాసల్
మీఱనెపుడు; నాకొఱకై
నీరజముఖి! చూడుమిచట నిల్చి కరుణన్మై.

తే॥ గీ॥ ఈ తరువుకడ, నీ సెలయేటిదరిని
నీయుపవనాంతరంబున నేకతమున
నిన్ను దర్శించి భాషింపనేఁదలఁతు,
వనిత! నాముద్దు చెల్లింప వలయుఁజుమ్మీ.

కం॥ జనకుని యనుమతి నెటులై
నను బడసి యొసంగు దర్శనంబును; నే వ
చ్చిన వెనుక భావిజీవిత
మును గూర్చి తలంచుదము; ప్రఫుల్లాబ్జముఖీ!”

తే॥ గీ॥ ఈ పగిదిఁ బ్రియురాలి ననేకగతుల
నూరడించుచు నుండఁగా జేరవచ్చి
రచటి కాతని సవయస్కు లంత గీత
యొదిగి నిలుచుండె నొకపూల పొదమఱుగున.

కం॥ అరుదెంచిన హితుల విజయుఁ
డరుదారఁగ గౌరవించి, యాయములోడన్

బరిచయముం జేయించెను—
పరమాహ్లాదము వారు "భద్రమె?" యనినఁ.

తే॥ గీ॥ అతఁడు నదిలో మునుంగుట యాదిగాఁగ
లట్టి వృత్తాంతములు సెప్ప, నంతవారు
సంభ్రమంబునఁ దమ కృతజ్ఞతలఁ దెల్పి
యాపెకు నమస్కరించిర, నంతరమున;—

తే॥ గీ॥ కొంతవడి మాటలాడి, యా కోమలాంగి
సెలవుగొని, యుద్ధమందునఁ జేరు కాంక్ష
దెల్పి, విజయునితోడ నదిందరించి,
యరుగుచుండిరి వారు రయంబు మెఱయ.

షట్పాదగీతి : హితులఁగలిసి, ప్రేయసి యనుమతినిఁ బడసి,
మనసు వెనుకకు, కాళ్ళు ముందునకు సాగ
విజయుఁడు పురోన్ముఖుండయి వెడలుచుండె-
నతఁడు దృక్పథమును బాయునంతదాఁక
కనులు శ్రావణమాస మేఘములఁబోల
గీత యట నిలుచుండి వీక్షించుచుండె—



క॥ వారము గడచిన, విజయుఁడు
సేరన్ రాఁడాయె,-గీతచిత్తమునంతే
పారెన్ విచార; మయినన్
దా రాగలఁడంచుమదిని దలచెద్దృఢముగాన్.

తే॥ గీ॥ విజయుఁడరిగిన మొదట విహ్వలాత్మ
తండ్రికెన్నఁడు దెల్పదు తనదువృత్త
మతని మనమున వేదనయగునటంచు
భీతిలజ్జలు పెనగొని బిగియఁబట్ట.

తే॥ గీ॥ ఎల్లియో నేఁడో విజయుఁడే యేగుదెంచి
తావచించును జరిగిన తంత్రమెల్ల
నన్నిటనతండుదగినవాఁడగుట జనకుఁ
డతని సంభావితునిఁ జేయునంచుఁదలచు.

క॥ విజయునకుఁ దన్నొసంగుట
కు జనకుఁడు నవశ్యమొప్పుకొనునంచా నీ
రజముఖి యువ్విళ్ళూరుచు
నిజకాంతుని రాకగోరి నెఱివీక్షించున్.

తే॥ గీ॥ హృదయదయితునిఁ బెడఁబాసి యిందువదన
అఖిలలోకంబు తనకు శూన్యంబటంచుఁ
దలఁచి, వలపోతఁ దానెంతో కలఁగుచుండె;
ప్రియవిరహతాపమనుభవవేద్యమగును.

తే॥ గీ॥ మనసు గలసిన ప్రియజనుల్ మఱుఁగువడిన
మనఁగవచ్చునె యేరి కీ మహితలమున!
నందుహృదయేశ్వరుండని యనవరతముఁ
దలఁచు ప్రియతముఁ డెడయైన మెలఁగవశమె!

మ॥ క్రమముందప్పక తిర్గుచుం డెబుతుచక్రం బట్టియా యేటిప్రాం
తమునంగల్గు మహీరుహంబుకడ, గీతా దేవి రేలుంబవ
ల్గమితోత్కంఠతతోఁ బ్రియుంగనెడు నూత్నాశాలత
ల్డెందమం
దమరం బెంచుచునిల్చు; వేసరక, ఆయాసంబుబాటింపకే

మ॥ విజయుండీమఱునాఁడెవచ్చునని యువ్విళ్లూరు-మర్నాఁడునీ
రజబంధుండ పరాబ్ధిఁగ్రుంకువఱకా రాటంబుతో వేచి; యా
తుజముం జేరుచుఁ గొంత సేపు సలుదిక్కుల్చూచినిట్టూర్చఁగా
రజనీ కాంతయె జాలిఁజెందియల నిద్రాదేవి నంపుందయన్.

తే॥ గీ॥ ప్రియుని తెన్నులు జూచునా వెలదికన్నుఁ
గవను నిమిషత్వమొకకొంత కలుగఁజేయ
యత్నమొనరించి యొకగడియయెజయంబు
నొందుచుండునిద్రాదేవి యోర్మిగల్గి.

సీ॥ హృదయంబునిండి పాఱెడు బాష్పధారల
నేత్రాంతముల యందె నిల్పఁజూచు
వేడినిట్టూర్పుల వాడిన పెదవులఁ
జిన్నగాహసియింపఁ జేయఁజూచు
నలఘువిషాదసంకలిత ముఖాబ్జినిఁ
జిఱునవ్వు తెరలను జేర్పఁజూచు

నా ప్తులయెదుట సౌఖ్యానందములఁ బ్రద
ర్శించు ప్రయత్నంబుఁ జేయఁజూచు
సురతరాంతర పరితాపమొరులయెదుట
బయలుపడ నీదు నేత యేపగిదినైన;—
ననుభవములేని వారల కరయనగునె
ప్రియవియోగజమైనట్టి హృదయబాధ!

సీ॥ "ఎట్టి మనోవ్యథయే? తెల్పవే!" యని
సానుభూతినిఁ జూపు సఖియలకును
"ఇట్లు కృశించితివేలనమ్మా!" యని
ప్రేమమైఁ బ్రశ్నించు పితరులకును
"ఏలనెప్పటివలె నెలనవ్వు లేద"ని
యనుకంపనడుగు వృద్ధాంగనలకు
"ఈమె యీ గతినుండనేల?" యంచొండొరుల్
భాషించుకొను పల్లెవాసులకును;
యెన్నఁడును మాఱువలుకక యేకతమునఁ
జెప్పికొనుఁ దన వెతలఁ బ్రశ్నింపనట్టి
ప్రకృతి సతికిని; దనదు భావంబులందు
మెలఁగు ప్రియవిజయునకు నా కలువకంటి—

తే॥ గీ॥ ఎవ్వరికి నెప్డుఁ దెలియంగనీయరాని
బాధయని; దానిదెల్పిన బంధులైన,
నెట్టిసానుభూతిని దెల్పు హితులునైన
పరిహాసింతురొకప్పుడు పరుల యెదుట—

మ॥ ఎవరేమన్నను లక్ష్యపెట్టదు;- ప్రియుండేరాసచో నింక నె
ట్లవునో? యెందఱునవ్వువారో? యనుచ త్యంతంబు
దుఃఖంబుఁ జెం
దివిచారించు; నొక్కొక్కయప్పుడునిజాదృష్టంబుబాగున్న రెం
డవనాఁడాతఁడువచ్చుఁదప్పదనివేడ్కంజెందు నత్యాశమైన్-

తే॥ గీ॥ ఆశతో నిట్లు పెక్కునాళ్లామె జీవి
తంబు గడపుచు నుండెను;- ధరణిలోన
ననవరత దుఃఖహతులైన జనులు, భావి
యాశచే దుఃఖవిస్మృతి నందుచుండ్రు.

తే॥ గీ॥ ఆశయే లేనినాఁడు సన్యాసులైనఁ
గావలయు, లేనిచో బ్రతుకంగవశమె?
గతము, వర్తమానము, దుఃఖయుతములైన
భావిసుఖమందఁ గలమని బ్రదుకవచ్చు

తే॥ గీ॥ వృద్ధుఁడగుటఁ గొన్నాళ్లకావెలఁది తండ్రి
తనువుచాలించెను విశాలధరణి యందు
దనయనొంటిగవీడి, "యీజననమరణ
దివ్యసర్జన కర్తనీ దిక్క"టంచు.

క॥ జనకునిఁ గోల్పోయిన యు
వ్వనితామణి జీవితంబు వ్యర్థమనుచు నెం
చినదైన; విజయుఁడెప్పుడై
ననురాఁగలడనెడు గట్టినమ్మక మొదవన్.

తే॥ గీ॥ బ్రతుకు చుండెను జీవచ్ఛవంబుపగిది
పల్లెయందు వసించెడువార లెపుడు

సాయపడుచు నాయమ సతి శ్రద్ధతోడఁ
గాంచుచుండి రెంతయుననుకంపమీఱ.

తే॥ గీ॥ వారములు, మాసములు, పలువత్సరములు
గడచుచుండెను-ప్రకృతిలోఁగలుగదయ్యె
మార్పులేశంబు ; సుఖదుఃఖమయజగంబు
వరలె నిర్వికారముగ నెప్పటివిధమున.

క॥ అనిమేషనిరీక్షణముల
ననవరతముఁ జూచుచును, రవంతవిసుగులే
క, నిరాశ జెందఁబోక, ప్రి
యునిచింతన సేయు నితర మొల్లకమదిలోన్.

చ॥ "కపటము లేని భావములు గల్గినచూపుల వాఁడు; నేరికే
నపకృతి జేయనట్టి హృదయంబుగలట్టి యతండు; వంచనం
బెపుడును నాకొనర్పఁడిటు లే ననుమానముఁ జెందరాదు, తా
నెపుడయినన్నుంగనఁగ నిందకు దెంచు నిరాశ యేటికిన్?"

తే॥ గీ॥ అనిమదిన్ దృఢ విశ్వాసమతిశయింపఁ
బెక్కువత్సరాల్గడచిన పిదపనైన
విస్మరింపదుగీత తా విజయు నెపుడు
ప్రత్యహము వేచియుండు నవారితముగ.

క॥ ఒకదినమాత్రోవను సై
నికులిర్వురు బోవుటావనిత కన్గొని చెం
తకుఁ బోయె పరుగు పరుగున
వికచాంబుజవదనయగుచు, వేడుకపడుచున్.

తే॥ గీ॥ "నాఁడు విజయునికై వచ్చినారు వీరె"
యనుచుఁ దలపోసి, యప్పుడయ్యలరుఁ బోఁడి

సంభ్రమముదోఁప గడుసంతసమున వారి
నడిగె ప్రియతముఁ గూర్చియత్యాశతోడ.

తే॥ గీ॥ వారుక్షణకాల మూమెనుతేటపారఁ
గాంచి, స్మరణకురాఁగ నాకాంతతోడఁ
బలుకసాగిరి కొంతసేపటికి గతముఁ
ద్రవ్వికొంచువిచారంబుఁ దడవికొనగ.

ఉ॥ "ఎన్నటిమాట! మా విజయుఁడీల్గెనుయుద్ధమునందునిన్నుగ
న్గొన్న ద్వితీయవారమునఁ గోమలి! రేలుబవళ్ళునాతఁడున్
నిన్నుదలంచుచుండి, మఱి శ్రించుచు, "గీత!నినుంగనంగ నిం
కెన్నఁడు రాను నీవిఁక సరీక్షణ సేయకు"మంచు నేడిచెన్.

ఉ॥ "ఎంతగ నా వియోగమున కేడ్చునొ గీతయు; రెండునాళ్ళకై
యింతటి ప్రేమపాశమున నేటికి బద్ధులమైతి; మైన నొ
క్కింతసుఖంబుఁగాంచక యె యిట్లెడఁబాసితి మేల!" నంచునో
కాంతరో! మా సుమిత్రుఁడధికంబగు దుఃఖమునొందె"—
నావుడున్.

కం. విని, పొంగిపొరలు దుఃఖం
బును మదిలోనాఁపికొనుచుఁబోలుపరి యా భా
మిని వారల వీడ్కొని, త
త్క్షణమే వృక్షంబుఁజేరఁ జయ్యన నరిగెన్.

సీ॥ "నా నిరీక్షణము లీనాఁటికి వ్యర్థంబు
లై చనె—స్వర్గంబునందునుండి
నా కొఱకై నీవనారతంబును నిరీ
క్షణ మొనర్చెదవేమొ! కలవిధంబు

నెఱుఁగక నేనింతవరకు నిన్ శ్రమపెట్టి
నాను- మన్నింపు ప్రాణప్రియుండ!
నీ నిరీక్షణముల నేఁటికి సఫలంబు
లొనరింప నరుదెంచుచున్న దానఁ
దెరువుజూపి నన్ జెంతకుఁ దీసికొమ్ము—
"కాలమింక నేమియును జేయఁజాల" దనుచు
స్వర్గధాముఁడై యున్న విజయునిఁ జేర
నరిగె నాబిడ యాత్మసంబరముతోడ—
ఓం తత్సత్



# అంబపాలి

చ॥ కలువలు నవ్వువేళ కల కంఠియొకర్తె గృహాంగణంబునం
గలుగలుమంచుఁ బాదముల కాంచన నూపురముల్
చలింప నం
చలగతినల్లనల్లనఁ బచారులు సేయుచు కంఠమెత్తి, మం
జులముగఁ బాడుచుం దెగడుసొంపగుభావమయప్రబంధముల్

ఉ॥ ఆతలిరాకుఁ బోఁడియపు డప్పుడు నాట్యముసేయుఁ బాదకం
జాతములందు నందియల చప్పుడు దేవనదీతరంగసం
జాతమనోహరధ్వనుల చందము దోఁపగ, గాలిలోన జీ
మూతములట్లు కుంతలసమూహ మువాళినిఁ దాండవింపఁగన్

ఉ॥ అల్లనఁ జేయిసాచి, కట కాభరణంబులు గల్లన, న్నవో
త్ఫుల్లములైన చెంగలువ పూలనుఁగోసి. సరోజినీలతల్
మెల్లఁగ ముట్టియూఁపును నిమీలితపద్మములందుఁ జిక్కి, ఝో
షిల్లిపడున్న తుమ్మెదలు శింజితముల్సలుపన్ప్రియముక్తికై.

ఉ॥ ఆ యమ 'యంబపాలి' యనునాఖ్యఁ దనర్చెడు వారకాంత; లేఁ
బ్రాయమునందనన్యసులభంబగు నాట్యకళారహస్య మా
ప్యాయముగా గ్రహించి, మగధాధిపుమన్ననలంది, యప్సరో
జ్ఞాయతనేత్రలుం బడయనట్టి మహావిభవంబులం గనెన్.

ఉ॥ మామిడితోఁటలోన రుచి మన్మణిశోభిత దివ్యహర్మ్యస్థలం
దామె వసించు; నప్పటి ధనాధిపులెల్లరహర్నిశంబు నా
కామిని సంగమంబునకుఁ గాంక్షమెయిం దమవిత్తరాసులం
గాముకులై యుపాయనముగాగ సమర్పణ జేసిరాదటన్.

ఉ॥ అందఱిలోననామె మగధాధిపునత్యధికానురక్తి మీ
అం దిలకించుచుఁ; నాతఁడు గరంబనురాగముదోఁపనామెచేం
తందన యిచ్చనుండును ముదంబున; నీగతి వారి ప్రేమ పెం
పొందెను, రానురానదియె యొప్పెను గాఢతరానుబంధమై.
క॥ కామంబొక్కొక్కప్పుడు
ప్రేమంబుగమాఱుఁ; నదియె పెంపొందిన ని
ష్కామ కృతియగుఁ బవిత్ర
ప్రేమంబన నొప్పు నదియె పృథ్వీస్థలిలోన్.
చ॥ ఇనుఁడపరాబ్ధి క్రుంకిన మహీపతి యా జవరాలు మేడకుం
జనుఁ బ్రతిరాత్రిఁ; యెన్నఁడును జాగొనరింపఁడుమానఁ;
డైన, నా
దినమున జాగుచేసిన, మదింగడు దత్తరపాటుదోఁప న
వ్వనరుహనేత్రి ప్రేయసుఁడు వచ్చెడు త్రోవలు జూచు
చుండఁగన్.
సీ॥ వదనబింబమున దివ్యతర భావము, లమం
దానందమును, నపూర్వానుభూతి,
సచ్చింత, సంతృప్తి, సన్మతి, విషయ వై
రాగ్యము, నిర్వికారతయుఁ, బ్రస్ఫు
టముగఁదోఁపఁగ నిరాడంబరంబుగ భూపుఁ
డరుదెంచె నతి మందయాన మొప్ప;
నతని వైఖరిఁగాంచి, యయ్యంబపాలి చ
కిత యగుచు నెదురేగి, కేలుమోడ్చి,
యిట్లు వచియించు, "నేడు మీ రేలనిట్లు
లున్నవారు? మిమ్ముంజూచుచున్న నా క

పూర్వమగు భక్తిభావంబు బొదలుచుండె
నేందుకీ పరిణామ మే నెఱుఁగజాల!"

చ॥ అనవుఁడు బింబిసారుఁడు ప్రియంగని పల్కె మృదు
స్వరంబునన్
"వనరుహగంధి! నీవు మన భాగ్యవశంబున గౌతముండు వ
చ్చెను మనరాజధానికి; వసించెనువద్గృహమందు నామహా
త్మునిచరణంబు లంటితిని; దుఃఖచయంబుఁబరిత్యజించితిన్.

క॥ ఆతని దివ్యప్రేమం
బేతీరున మఱవ వచ్చు నింతి! సమంబే
మాతిశయంబునఁగన్గొని
నీతులబోధించెఁ గరుణ నివ్వటిలంగన్."

చ॥ అనివచియింపనవ్వనిత యచ్చెరువంది, "యివేటిమాటలో
జనవర! పూరుషుండతఁడు; సర్వమువీడి, వనంబులందుఁబ
త్తనములయందుఁదానొకవిధంబునఁగ్రుమ్మరుచుండునెట్టివా
రినితనవారనండతని ప్రేమము దెట్టిదొ? చోద్యమయ్యెడిన్

చ॥ అనుపమలీలఁ ప్రేమికుల మైక్షణకాలవియోగ మైననై
పనలవిగాక వర్ణ్యమగు బాధఁగృశించెడు నట్టెనీకు నా
కును గల ప్రేమఁబోలినదొకో! జననాయక! సన్యసించి ని
ర్జనవనులందుఁ గ్రుమ్మరెడు శాక్యమునీంద్రుని ప్రేమ
యెంచగన్."

చ॥ అనవుడు నాతఁడిట్లనుఁ "జరాచరకోటినిఁ బ్రేమఁజూచు నా
మునివరు ప్రేమ నీవు పువుబోణి! యెఱుంగఁగలేవు; నీకు నా
కునుగల ప్రేమస్వార్థమదికొన్ని దినంబులుమాత్రముండునా
తని దగుప్రేమ నిత్యమిదితథ్యమటంచును లో నెఱుంగుమా!

చ॥ ఒకరినిఁ బ్రేమఁ జూచుచు, మఱొక్కరి హేయముగాఁగఁ జూచు వా
రి కెటులెఱుంగనౌనతని ప్రేమను? ప్రాణులనెల్ల భేదమిం
చుకయును లేక యొక్కగతిఁ జూచు నతండు విశాలమానసుం
డ కలుషచిత్తుఁడాతని మహాప్రణయంబు నెఱుంగవచ్చునే!

ఉ॥ అందముఁ జూచి యప్సరసలైనను జెక్కిట వ్రేలుఁ జేర్చి మె
చ్చందగు నా యశోధరను-జందురుఁ బోలిన రాహులుంజగం
బందలి ప్రాణికోటి పడునట్టి మహార్తిఁ దొలంగఁజేయు బు
ద్ధిం దన యింటవీడి బహుదేశములం దిరుగాడు భిక్షుఁడై.

కం॥ జ్ఞానోదయమ్మైన పిదప
నానా దేశములఁగల జనంబులకును ని
త్యానందంబు లభించు వి
ధానము బోధించె బౌద్ధధర్మగురుండై.

చ॥ శమము, దమంబు, సన్మతియు, క్షాంతి, యహింసయు, సత్స్వభావముల్
విమలజనానురాగమును, విశ్రుతి, యింపగు సొంపుగల్గు గౌ
తముఁ డమరుండు, విశ్వహిత తత్పరుఁ డర్థిజనార్థ శాఖి' స
త్తముఁ డఖిలార్థ వేది,వనితా! కనలేవు తదీయతత్త్వముల్."

చ॥ అనివచియింప నవ్వనరుహానన తన్మయయౌచు, మానసం
బున భయభక్తి భావములపూర్వములై జనియింప శ్రద్ధతో
వినుచు జగద్గురుండును పవిత్రచరిత్రుఁడునైన బుద్ధదే
వుని చరణాంబుజాతములపూజలొనర్చి, తరింపఁజింతిలెన్.

క॥ తరువాతి వత్సరంబున
నరుదెంచెను బుద్ధదేవుఁడానగరికి, భూ

వరుఁడును, ధనాఢ్య జనులె
ల్లరుఁ జేరిరి దర్శనాభిలాషన చటికిఁ-

తే॥ గీ॥ ఆదినంబందఱకు మున్న నంబపాలి
బుద్ధదేవుని దర్శించు బుద్ధితోడ
నందలంబెక్కి, చెలికత్తియలను గూడి
యతులితాడంబరంబుతో నరిగి; యచట-

సీ॥ సచ్చిదానందంబు, సర్వజ్ఞతయుఁ బ్రస్ఫు
టంబుగాఁ జాటు ముఖంబుతోడ,
పరిమితకారుణ్య మత్యంత తేజంబుఁ బ్ర
దర్శించు విమల నేత్రములతోడ,
బాలసూర్యప్రభా భాసమానంబైన
రమణీయ దివ్య విగ్రహముతోడ,
నిశ్చలభావంబు నిర్వికారత గల్గి
మానుషాతీతమౌ మహిమతోడ

సమలపద్మాసనాసీనుఁడై నవాని
మానవుల నందఱను జరా మరణ దుఃఖ
పాదములనుండి తొలఁగింపఁ జాలుమార్గ
మరయ సర్వసంగత్యాగి యైనవాని-

తే॥ గీ॥ కాంచి యప్రయత్నముగ నాకెలుసకంటి
సాగిలంబడి మ్రొక్కి, తానల్పినట్టి
పాపములకుఁ బశ్చాత్తాప పడియె; నాత్మ
శక్తికిని సాటియగు వేఱు శక్తిగలదె!

క॥ పిమ్మట భయభక్తులు హృద
యమ్మున నివ్వటిల నామె హస్తాంబుజయు
గ్మమ్ము ముకుళించి, "నాదుగృ
హమ్మును పావనముఁ జేయ నరుదెండనఘా!"

క॥ అనిప్రార్థించిన గౌతముఁ
డనురాగముతోడ 'వల్లె' యనె; మోదముచేఁ
తనగవుసంధిల; వేశ్యయు
ననుపమ సంతోషభరితయై మగిడిచనెన్-

తే॥ గీ॥ అంత నితరులు నాత్మగృహంబులందు
విందుఁగొనుఁడని భక్తితో వేఁడికొనఁగ
నతఁడు, 'ముందొక వేశ్య విందారగింప
నీయకొంటి' ననఁగ వారెల్లనపుడు-

క॥ 'ఈ వైశాలీనగరము
లో వేలకొలంది నాఢ్యులును సత్కులజుల్
తావక పూజకులుండఁగ
నా వేశ్యగృహంబుఁ జొరఁగ నౌనె! మహాత్మా!'

చ॥ అనవుడు ధర్మరాజు నగి
యల్లసనిట్లను, 'భోగకాంతప
ర్తనమునుదిద్ది, తిన్నని ప
థంబునఁ జేర్చుట ముఖ్యమంచు విం
దనయితి నామెయింటికి ము
దంబునదొత్తినె; మీకుఁబోలదే

ననుమతిఁగొంచు నచ్చెదఁద
దానతిమీ వెనువెంటఁ బ్రీతితోడ.'

సీ॥ అనినవారెల్ల రయ్యంబ పాలినిఁజేరి
పలికిరా చెలికిఁ దర్పంబు వెలయ-
"వారకామిని! రాజవరుల నాహ్వానింప
వలెగాని బుద్ధుని వంటియోగి
వరుల నాహ్వానింపఁ బనియేమి? యతడు నీ
వాంఛ లేవగిదిఁ దీర్పంగ లాఁడు?
అదిగాక, యతఁడు పుణ్యాత్ముఁడు; పాపభూ
యిష్టవౌ నీయింటి కెటులవచ్చు!
ధనముగల్గినయంత నే కనులపైన
పొరలు గప్పఁదానుండె గాబోలు నీకు
యుక్తమెయ్యది యెద్దియయుక్త మనెడు
జ్ఞానముండదె? యిట్టియజ్ఞానమేల"

మ॥ అనిబోధించు ధనేశులంగనుచు న
య్యంభోజ పత్రాక్షి యి
ట్లను, "మీరెల్లరహర్నిశంబులను ద్ర
వ్యంబెల్ల వెచ్చించి నా
యనురాగంబును గోరి బంటులటుల
త్త్యాశన్మదీయాలయం
బునవర్తించుట విస్మరించి యిపుడే
పుణ్యాత్ములైనారుగా!"

తే॥ గీ॥ ఆమెమాటలు వినఁగ ధనాధిపతులు
దెబ్బతగిలినవారి గతిఁ గ్షణంబు
నివ్వెఱంజెంది మాటాడ నేరరైరి;—
అనుకొనని మాట విన్నవట్లగును గాదె!

క॥ ధనికులు బల్కిరి తుద "కో
వనితా! కోపంబదేల? భగవానుండీ
దినమున మావిందుఁ గుడిచి
చనుదెంచును రేపుసీదు సదనంబునకుఁ—"

ఉ॥ "ఏలధనేశులార! యిటు
లెన్నఁడు గాద"ను నామె— వారు, "నీ
కేలవిచార మేమిపుడె
యిత్తుము వేయువరాలు" నాఁగ— "ని
ల్లేలవచింతురే నొసఁగ
నే పదివేల వరాలుఁ నేఁడు నా
యాలయమందు బుద్ధుఁడెటు
లైననువిందగు మాటలేటికిఁ

ఆ॥ వె॥ ప్రథమగౌరవంబు వడసెద నే నె బు
ద్ధునకు విందొసంగి, దోషతతిని
బాపికొందు నతికృపంజూచి మీరు నీ
ర్ష్యావిరహితులగుచు నరుగుడింక."

మ॥ అని కేల్దోయి మొగిడ్చి మ్రొక్కిన ప్రఫు
ల్లాంభోజ పత్రాక్షి నే

మనఁబోకా ధనవంతులెల్లరును నీ
శ్లాఘ్యభావముం జెంది. బు
ద్ధునిఁజేరంజని, 'స్వామి! యీపడఁతి మా
తో గర్వమేపారఁజ
య్యెన 'మీవాంఛ దృఢీకరించెదను, పే
రాసల్ విడుండాదట౯

ఆ॥ వె॥ ప్రథమగౌరవంబు వడసెదనేనె బు
ద్ధునకువిందొసంగి' తొలఁగు, డనుచుఁ
బరుషశైలిఁబల్కి-వంపించె నవమాని
తులము మాకునేది దోఁచ'దనిన

మ॥ విని బుద్ధుండు స్మితాననుండగుచు 'న
న్వేశ్యాంగనారత్నమి
ట్లొసరింపంగలదంచు నేఁ దెలిసియే
యున్నాఁడ; సన్మార్గ వ
ర్తినియై, పూతచరిత్ర యౌనవఁగ సం
దేహంబులే"దంచు,తో
డనె శిష్యాళినిఁగూడి యాయమనుజా
డంబోయె హర్షాత్ముఁడై

కం॥ అరుదెంచిన సిద్ధార్థుని
నరగున నవ్వేశ్య భక్తిసంభ్రమములు మ
ప్పిరిగొనఁగ నర్ఘ్యపాద్యా
ద్యురుసత్కారములఁ బ్రీతునొనరించెఁదగ౯

శా॥ అంతేవాసులఁ గూడి గౌతముఁడు న
య్యబ్జాక్షి యింటన్మహా
సంతోషంబున నారగించి యొక వృ
క్షచ్ఛాయ నాసీనుఁడై
నంతంజేరగ వచ్చి, యాయమయు సా
ష్టాంగంబుగా మ్రొక్కి - తాఁ
జెంతంగూర్చొని తాళ వృంతముల వీ
చెన్ భక్తి సంధిల్లఁగన్-

తే॥ గీ॥ అంతబుద్ధుఁడపారకృపార్ద్ర హృదయుఁ
డై, చతుస్సత్య సూక్తుల, నష్టవిధ వి
ధానములను, నిర్వాణ విధంబుఁ దెల్పి,
యుద్ధరించె న వ్వేశ్య నత్యుచితరీతి—

ఉ॥ ఆతరుణీ లలామము ధ
నాదుల నెల్లను భిక్షుకాళికిన్
బ్రీతిదలిర్ప దాన మొన
రించి, సమస్తము వీడి, యోగినీ
వ్రాతము గొల్వ దేశమున- స్వైర విహారము సల్పి బోధనా
జ్యోతి వెలుంగఁ జేసెను మ
హోజ్జ్వల భిక్షుకియై యిలాతలిన్

(స మా ప్త ము)



# మీరాబాయి

శా॥ దివ్యప్రేమ సుధాసుధారలను జిం
దెంచాల్లి విశ్వైక సం
సేవ్యుం డా మురళీమనోహరుని వం
శీనాదమాధారతే
నవ్యశ్రీలలరార నీ మధుర పీ
యానాదమందూఁగి వి
శ్వవ్యాప్తింగనిమించె గీతముల హా
వంబంది, శ్రావ్యంబులై.

అకళంకంబగునట్టి నీహృదయ ది
వ్యాంబోధియందుద్భవిం
చి, కవిత్వామృత ధారలెల్లెడ నవి
చ్ఛిన్నంబులై పాఱ నేఁ
టికిశుష్కంబులుగాక పాఱుచును సృ
ష్టించున్నిరంతంబు స
ర్వకళాభ్యర్థుల మానసంబులఁ బవి
త్రంబైన భావావళిన్

మ॥ కమనీయంబగు యుష్మదాత్మ నెఱుఁగం
గా లేక మార్గంబునన్

గుమతుల్ కొందరు తూలనాడినను, జె
ఝల్నైరములోనెపి చు
ట్టములే నిన్ను నిరాకరించినను, ది
ట్టంబైన నీ చిత్త దా
ర్ఢ్యములోపించ దొకించుకంతయును కృ
ష్ణారాధన ప్రక్రియన్.

---

# 1

తే॥ గీ॥ ఆదిపదియు నారవ శతాబ్దమపుడు భార
తావనిని మొగలు పాదుషాలలఘుశౌర్య
మెసఁగఁ బాలించుచుండి రుర్వీశులెల్లఁ
దలలు వంచి సామంతులై, కొలుచుచుండ-

క॥ రాజస్థానంబునఁ బర
రాజభయంకరులు మేఁపరాక్రమ ధనులం
భోజ హితాహిత కులజులు
రాజత్వము నెరపి రపుడు రసపుత్రులొగిన్.

చ॥ కలదు ‘మెరాత’ నాఁ బరఁగు
గ్రామమటన్ రసపుత్ర వంశజా
తులు స్పృహణీయ ధర్మనిర
తుల్ శుభ వర్తను లంది రేశభ
క్తులునగు బీదదంపతుల
కున్ జనియించెను బుణ్యలక్షణాల్
గలిగిన బాలికామణియొ
కర్తు పయోనిధిఁ గౌస్తుభంబనన్.

ఆ॥ వె॥ శుభఘటికను బుట్టి, చూచువారలకు న
చ్చెరువు గొల్పునట్లు జెలఁగుచున్న
ముద్దుబిడ్డఁజూచి పుణ్యదంపతులు మో
దమునుబొంది కొల్చి రమరవంద్యు.

మ॥ భగవల్లీలల చాయలం దెలియు న
ద్వయ్యుం డొకం డేగి యా
భగవద్భక్తి విధంబుఁ దెల్పి, యాటన
బాబ్బలామణిం గాంచి, "యీ
జగతిన్ దైవగుణ ప్రచారమునకై
జన్మించె నీయింట నీ
సుగుణజ్యోతి" యటంచుఁ దెల్పి చనె నా
శుభ్రాంగి దీవించుచున్.

క॥ ఆ బాలికామణికి మా
రాబాయి యనంగఁ బేరు రాజిల్లెను, గా
రాబంబునఁ బెఱుఁగుచు వి
ద్యాబుద్ధుల నేర్చె బాల్య మందలఘుగతిన్.

క॥ గానముల గనియై, యందం
బున సురకాంతలను మించి, పుష్పమునకు వా
సనవలె గాంధర్వంబున
వినుతినడసి కవితఁజెప్పు విధములనరసెన్

క॥ అనిశము తలిదండ్రులు కృ
ష్ణుని మూర్తికిఁ బూజసేయఁ జూచి జననితో

పనియె నొకనాఁడు బ్రతుకం
బున నీతని గొల్వనేమి పుణ్యమొ యనుచున్-

క॥ అందులకాగేహిని తన
యం దన యంకమునఁ జేర్చి యనురాగముతో
నందాత్మజుని పరిభావం
బుం దెలిపెను, భక్తిపూర్వములఁ దెలివొందన్-

సీ॥ "బృందావనింబున బృందముల్ మేపుచుఁ
తిరిగె గొల్లలఁగూడి కరుణవెలయు,
యమునానదీసైకతముల వ్రజాంగనా
వితతితో నొనరించె విహరణంబు,
తనకు హాని యొనర్పఁదలఁచి వచ్చిన దుష్ట
రాక్షసులంగూల్చె రాముఁగూడి,
భక్తితోఁగొలుచు బ్రహ్మాప్రముఖుల నెంద
ఱెందఱనో ప్రేమమెసఁగఁ బ్రోచె
నతని తత్త్వంబు నెఱిఁగి భీష్మాదులెల్లఁ
బడసిరనితర లభ్యమౌపదవి; నరయ
నీశ్వరుని సన్నిధిం జేర నిచ్ఛగించు
ఋషులునుమున్నె గోపికలు నీరేజనయన!

క॥ ఈ దేవుని తత్త్వము బరి
హార్మ్యములు బోధింపఁజాలరంట! నాతరమా
నే! దివ్యజ్ఞానము సం
పాదింపుము తనయా! నీకు భద్రంబగుతన్.

క॥ భగవంతుని మహిమంబున్
దగ నెఱిఁగి ధ్రువస్థితిఁ గనవలె; క్షణికం
బగు జీవితంబు సార్థక
మగునట్లొనరింపవలె సముంచితభక్తిన్."

తే॥ గీ॥ అనుచు జనని కూతునకుఁ బ్రియమునఁ జేసి
నట్టి సదుపదేశంబున కాత్మ నలరి
నాఁటినుండియే కృష్ణు ననారతంబుఁ
గొలువ మొదలిడె మదిభక్తి మొలకలెత్త.

క॥ తన సర్వస్వంబును కృ
ష్ణునకు సమర్పింపనెంచి, సుఖవాంఛలకె
ప్డును మనమునఁ దావీయక
యనవరతము భాగవతుల యాశ్రయముఁ గనెన్.

క॥ మీరాసుగుణలతావళి
పారెన్ దేశంబు నాల్గువంకలకును నా
నీరేజగంధి కీర్తుల
సౌరభములు గుప్పుమనె దిశలయందెల్లన్.

తే॥ గీ॥ అపుడు మేవాడు యౌవరాజ్యాభిషిక్తు
కుంభరాణా విభుండు తద్గుణములరసి
కాంచె నామెను దేవేరి గాఁగఁ గోరి
పెద్దలందఱు మిగుల సంప్రీతిఁ జెంద.

క॥ అనుదిన కృత్యంబులు దా
ననవరతంబీశ్వరార్పణా దృతమతియై

నొనరించుచు నిర్లిప్తగ
వన జపలాశంబు మీఁది వనబిందువటుల్.

తే॥ కుంభసింహుఁడు రాజుగాఁ గునుంయాత్మి
పట్టపుదేవియయ్యె నప్పటికి నైన
నామెచిత్తంబు సనదు రాజ్యంబు వైపు
భక్తిమించినదే రాజ్య పదవి యారయ!

తే। రాజు మిగుల రసజ్ఞుఁడారామములను
జేరియాసింగూడి విహరింపఁ బ్రీతిసేయు-
రాణిదృఢభక్తి నేమందిరమున నైనఁ
గృష్ణునేకతమునఁ గొల్వఁ బ్రీతిసేయు.

తే। రాజు రాణి సోయగము వర్ణనము సేయు;
రాణి కృష్ణుని సొగసు వర్ణనము సేయు;
ప్రేమగీతుల నెపుడు విన్పించు రాజు;
కృష్ణగుణములఁ గీర్తించు నెపుడు రాణి.

తే॥ ఐహికంబులఁ గాంక్షించు నావిభుండు-
పారమార్థికముం గోరుఁ బ్రభ్వి యెపుడు-
ధవుని యాదేశములు తలఁ దాల్చికూడ
నవ్వకొనుచుండె నామె మతంబునందు.

తే। ఎగిడి దిగిడి చక్రంబుల నెనసియుండి
వారిదాంపత్య శకటంబు వక్రగతుల
నడుచుచుండెను- నృపుని మానసమునందు
తఱుగకుండెను ప్రేమ యా తరుణి పట్టు-

క॥ ఏకత్రమున నొకనాఁడా
భూకాంతుని వేఁడె రాణి మోదముదలిర్పన్
శ్రీకృష్ణాలయ మొక్కటి
వేకట్టింపుమని వినయవినమిత ముఖియై.

తే॥ భార్యపలుకాలతనికి శిరోధార్య మగుట
నపుడె యాగ్రామమున నొక్క యాలయంబు
నిర్మితము సేసె; నచట ననేకభక్త
యతిగణంబులు సేరె నత్యాదరమున.

తే॥ మొదటినాఁడు నరేంద్రుఁడు ముదితఁగూడి
రాజలాంఛన యుక్తుఁడై రాజగజము
నెక్కి యతుల వైభవమున నేగుదెంచి
కృష్ణుఁ బూజించె; భక్తులఁ దృప్తి పఱచె-

తే॥ కృష్ణమహిమాతిశయమును గీర్తించి
యాశుధారగఁ బెక్కు గేయములు పాడె
రాణి వీణియ మీటుచు; ప్రాజ్ఞులెల్లఁ
బరవశంబున వినుచు నచ్చెరువు నొంద.

తే॥ రేపుమాపును వీణ ధరించి రాణి
యాత్రిజనముల గూడి కృష్ణాలయమున
కనుదినంబరుగు టెఱిఁగి యధిపుఁడొక్క
నాఁడు కడువిచారంబున నాతినాఁపి.

మ॥ 'అరయంగా మనక్షత్రియాంగన, లనూ
ర్యం పశ్యలివిష్టా డి

స్ఫురణిక్ వీధులసంచరించు నెడ లో
కంబెంత నిందించునో
యరదంబులరులందలంబులును తే
వా! కాల్నడంబోవ సం
బరమా! పట్టపురాణిలీక్రియనాన
ర్పంబాడియూ కోమలీ!'

తే॥ అనినఁ బతితోడ నాభక్తురాలు నవ్వి
'ఏటికీబంధనంబులుక్ష్మేశ! నేను
లోకమునకు జంకను; కృష్ణలోలమగుచు
స్వేచ్ఛగాఁ దిరుగాడు నాచిత్త,' మనియె.

తే॥ రాజుకోపించియును బ్రియురాలికేమి
బదులు చెప్పఁజాలక తన హృదయమందు
మిగులఁగుమిలెను, 'ఎవరును మీరసట్టి
యాజ్ఞమీ■గదా రాణి' యనుచుఁదలఁచి.

## 2

క॥ నవరత్నములననెల్లెడ
లవినుతిగనినట్టి సత్కళావిదులను శే
ల్బనలు తనవెంట నిడుకొను
నవరసవిదుఁడగ్బరొక్కఁడు ముదితుఁడై.

క॥ మీరాసంగీతమున వి
శారదపూని వినతిమొయిని సభ్యుఁడొకఁడు ద

ర్బాభరున విన్నపమొనరుపఁ
గోరఁదొడఁగె నామె పాడుకొనుచుండ వినక్-

తే॥ రాజపుత్రులతో నకారణరణంబు
తెచ్చికొను కార్యమని మదిఁదెలియఁగాన
'తానసేన్' నాము గాన విద్వాంసుతోడ
మాఱువేసంబునంజనె మనుజవిభుఁడు.

తే॥ నగరి వెలుపల గుఱ్ఱముల్ దిగి, యిరువురు
మందిరంబునకరిగి, రామాలలాము
తన్మయత్వమునం బాడు ధ్యానగాన
ములను నైమఱిపొంది బొమ్మలవిధాన

తే॥ చేష్టలుడిగియాళ్లె కొంత సేపునిలిచి
'అహాహా! ధన్యవాదంబులోయమ్మ! సీకు-
రాలు కరగించు పాట! తోరంపుఁగవిత!
మధురగంభీర భావ మమలవచస్సు!!

ఉ॥ కమ్మయు గంటముంగొనక,
కమ్మనిగీతము లెట్లువ్రాసినా
వమ్మరో! యాశుధారనహా
హా! తనయంతటంబాని శబ్దజా
లమ్మరుదెంచి నీమదిఁ ద
లంచినతావుల నిల్చి రాగ తా
ళమ్ముల చొప్పుదప్పక, స
లక్షణమై మృదు భావయుక్తమై?

మ॥ అని శ్లాఘించుచుఁ బోవు సన్యాసి సమూ
ల్యంబైన హారంబు ని
చ్చెను భూనాథుఁడు, "కృష్ణ దేవుననుగాఁ
జేకొమ్ము దేవి! యిదే
యనుమానింతు విటుల?" యంచు నసఁగ న
య్యబ్జాక్షి భక్తాళితో
నను, "మీయిష్టము చెప్పుఁడయ్య! యిది గ్రా
హ్యంబా నాకిఁ బొసఁగా!"-

క॥ నా విని భక్తులనిరి, "దా
దేవీ! కృష్ణార్పణమని తీసికొనుమ్మీ; నీ
కీవిధముఁ దెలుపఁగలమె!
యీ వెఱుఁగవె మమ్ము నడుగనేల? జననిరో!"

తే॥ అపుడు మీర సూరత్నాల హారముగొని
యందఱుం జూచుచుండఁ గృష్ణార్పణమని
కృష్ణమూర్తికి భక్తి నర్పించె; నంతఁ
జెప్పిరావార్త నెవ్వరో క్షితివరునకు.

క॥ హారంబిచ్చిన వారలు
ద్వారంబును దాటినంత భక్తాకృతులన్
దూరంబుఁజేసి, రాతుల
తీరునఁ బయుగత్రిరమునఁ దెలిసెఁ బ్రభునకున్.

తే॥ "పరులు గనరానియట్టి మా భామినులను
గపట సన్యాసులై వచ్చి గాంచినారు,

భక్త్రురాలి నిటుల బంధనంబుల నుంచఁ
బాడికాదని చెప్ప బలము లేక,
ఆ మహా సాధ్వీలలామంబు నెఱుఁగవు,
వలదు రాజా! యన వలనుగాక,
ఘోర విషంబెట్లు గ్రోలునో! యిట్టి యి
న్యాయంబు గూడ దంచనఁగ లేక,
విభుని యాజ్ఞకు మాఱాడ కెఱచి, తలలు
వంచి, యేమిక మూడునో యంచు మదిని
తత్తరము నొందఁ బోయిరందఱును మగిడి
తిరముగాఁ బరమేశుఁ బ్రార్థించు కొనుచు.
తే॥ రాజు విషపాత్రముం దెచ్చి రాణియెదుట
నుంచి, "నీవల్లఁ దలవంపు లొదవె మాకు,
రాణివాసంబుఁ జూచెఁ బరాయివాఁడు.
నాతి! నిందమేలో! మరణంబు మేలో!
క॥ ఆలోచించి, విషంబును
గ్రోలుము నీ" వనిన యంతఁ గోమలి యా నిం
దాలాపంబులు సైపక
నేలకొఱఁగ దెబ్బవడిన నీడ మృగియక్-
తే॥ కొంతసేపైన పిదప నక్కోమలాంగి
తెప్పిరిలి, లేచి కృష్ణుని దివ్యమూర్తిఁ
గాంచి మ్రొక్కుచు హస్తయుగ్మంబు మొగిచి
ప్రార్థనము సేసె నిట్లని భక్తిమెయిని,
మ॥ "జనని లోకము విశ్వసింప దిది య
న్యాయంబు;- నామానసం

బున శివార్చకుఁడవే యెఱింగెదు సితాం
భోజాక్షి! నానాథుఁడే
యనుమానించె; నిదేటి జీవిత మిఁసీ!
హాలాహలంబిచ్చినా
రనుమానింపక త్రాగెదన్ నగుచు, దే
వా! ఆజ్ఞయే నాకిఁకన్!"
శా॥ రాణావైపు మొగంబు నేఁడి యను, "నో
రాజాగ్రణీ! నీవు నా
ప్రాణాధీశుఁడవీభవంబున, నినున్
బ్రార్థింతు, భక్తైకసం
త్రాణుండో హరిపాదపద్మముఁ జే
రంబోవ దీవింపు మీ
క్షోణిన్నిన్ సుఖపెట్ట నైతినని వ
గ్నోపింపఁ బోకాత్మలోన్-
శా॥ ఉన్మిఁగ యుక్త! పామరుండువలె నీ
వున్నావు మిథ్యాభ్రమన్;
సర్వజ్ఞుండగు కృష్ణుఁడే యెఱుఁగు నా
చందంబు, నీవంశవుం
బర్వుంగాచుట నాకు ధర్మమెకదా!
భక్షింతుఁ దెమ్మా విషం
బుర్విన్ శాశ్వతమౌ యశంబుఁగని యు
త్కృష్టోత్సాహముంబొందుమీ!"
తే॥ అనుచు విషమును మధురపయస్సువోలెఁ
గ్రోలెఁ గృష్ణునిఁ గీర్తించుకొనుచు మఱని,

తిములు దృష్టి పడఁగ నావనము మీఁ
ద ప్రచండహాసంబు నా
ర్తిమ సేయున్ భవదీయమూర్తి ప్రతిచ్ఛా
యగ్రమ్మునం గట్టిన
క్షి మనోరంజకమాయఁ గప్పెదవు నా
ప్రజ్ఞ న్నసమక్షంబునన్.

సీ. నీలాంబుదశ్యామ! నీలోన విద్యుల్ల
తంబోతలీ పైని తనివోఁదలఁతో
నీశ్వానఁ తేటసిఁడి వెలుఁగుపరంజ్యోతి
రూప! నీలో నీదీపకళిః
కలిసిపోవలెనని కాంక్షింతు - నీపూవు
నీపదంబుల గాంచి నగవుఁగాక!

తే. విశ్వమున జనియించినందుంకు నే
నానందింపఁదగిన దేమున్నదింక?
అనుభవించితిఁజాలు, దయాంబురాశి!
చేర్చుకొనుమయ్య! నీలోన శ్రీశ! నన్ను
అనుచుఁ గృష్ణస్వామి లీనమయ్యె మీర:
మేదినీశుఁడు వచ్చె కీర్తింపుమనుచు.

ఓం తత్సత్

సంపూర్ణము

